## అథ త్రిపంచాశత్తమోఽధ్యాయః

## ఉషా అనిరుద్ధుల వివాహము

సనత్కుమార ఉవాచ |

అథ బాణాసురః క్రుద్ధస్తత్ర గత్వా దదర్శ తమ్ |
దివ్యలీలాత్తవపుషం ప్రథమే వయసి స్థితమ్ || 1

తం దృష్ట్వా విస్మితం వాక్యం కిం కారణమథా బ్రవీత్ | బాణః
క్రోధపరీతాత్మా యుధి శౌండో హసన్నివ || 2

అహెూ మనుష్యో రూపాఢ్య స్సాహసీ ధైర్యవానితి|
కోయమాగతకాలశ్చ దుష్టభాగ్యో విమూఢధీః || 3

యేన మే కులచారిత్రం దూషితం దుహి తా హితా | తం
మారయధ్వం కుపితాశ్శీఘ్రం శ##సై#్రస్సుదారుణైః || 4

దురాచారం చ తం బద్ధ్వా ఘోరే కారాగృహే తతః | రక్షధ్వం వికటే
వీరా బహుకాలం విశేషతః || 5

న జానే కోఽయమభయః కో వా ఘోరపరాక్రమః | విచార్యేతి
మహాబుద్ధి స్సందిగ్ధోఽ భూచ్చరాసురః || 6

తతో దైత్యేన సైన్యం తు దశసాహస్రకం శ##నైః | వధాయ తస్య
వీరస్య వ్యాదిష్టం పాపబుద్ధినా || 7

తదాదిష్టాస్తు తే వీరాస్సర్వతోంతః పురం ద్రుతమ్ |
ఛాదయామాసురత్యుగ్రాశ్ఛింది భిందీతి వాదినః || 8

శత్రుసైన్యం తతో దృష్ట్వా గర్జమానస్స యాదవః |
అంతఃపురంద్వారగతం పరిఘం గృహ్య చాతులమ్ || 9

నిష్క్రాంతో భవనాత్తస్మాద్వజ్రహస్త ఇవాంతకః | తేన తాన్
కింకరాన్ హత్వా పునశ్చాంతః పురం య¸° || 10

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

అపుడు బాణాసురుడు మిక్కిలి కోపొంచి అచటకు వెళ్లి, దివ్యలీలాదేహమును దాల్చి ¸ంవనములోనున్న అనిరుద్ధుని గాంచెను (1). వానిని చూచి యుద్ధవిశారదుడగు బాణుడు కోపముతో మండిపడే మనస్సు గలవాడై, ఈతడు ఇట్లు చేయుటకు కారణమేమియో అని విస్మయమును పొంది, చిరునవ్వును ప్రదర్శించుచున్నట్లు ఉన్నవాడై ఇట్లు పలికెను. (2). ఆశ్చర్యము ! రూపవంతుడగు ఈ మానవుడ ధైర్యసామసములు గలవాడు. దురదృష్టవంతుడు, మోహితమైన బుద్ధిగలవాడు మరియు చావు మూడినవాడు అగు ఈతడు ఎవడైయుండును? (3) నాకు ప్రీతిపాత్రమగు నా కుమారైను చెడగొట్టి వంశమర్యాదను పాడుజేసిన వీనిని శీఘ్రముగా మిక్కిలి భయంకరములగు శస్త్రాస్త్రములతో క్రోధపూర్వకముగా కొట్టుడు. (4). ఓ వీరులారా! ఈ దుర్మార్గుని భయంకరమగు కారాగారములో బంధించి చిరకాలము ప్రత్యేకముగా రక్షించుడు (5). భయంకరమగు పరాక్రమముగల వీనికి భయము లేకున్నది. వీడెవడో నాకు అర్థమగుట లేదని మహాబుద్ధిశాలియగు ఆ బాణాసురుడు ఆలోచించి ఒక నిర్ణయమునకు రాలేకపోయెను (6). అపుడా పాపాత్ముడగు రాక్షసుడగు ఆ వీరుని వధించుటకై క్రమముగా పదివేలమంది సైన్యమును ఆదేశించెను (7). వానిచే ఆదేశించబడిన మిక్కిలి భయంకరులగు ఆ వీరులు నరుకుడు, చంపుడు అని పలుకుతూ అంతఃపురమునంతనూ వెంటనే చుట్టుముట్టిరి (8). యదువంశీయుడగు ఆ అనిరుద్ధుడు అపుడా సైన్యమును గాంచి గర్జిస్తూ అంతఃపురద్వారమువద్ద గల సాటిలేని పరిఘాయుధమును చేతబట్టి (9). వజ్రమును పట్టుకొనియున్న యమునివలె ఆ భవనమునుండి బయటకు వచ్చి దానితో ఆ కింకరులను సంహరించి మరల అంతఃపురములోనికి వెళ్లెను (10).

ఏవం దశసహస్రాణి సైన్యాని మునిసత్తమ | జఘాన రోషరక్తాక్షో వర్ధిత శ్శివతేజసా ||

లక్షే హతే%థ యోధానాం తతో బాణాసురో రుషా | కుంభాండం స గృహీత్వా తు యుద్ధే శౌండం సమహ్వాయత్ || 12

అనిరుద్ధం మహాబుద్ధిం ద్వంద్వయుద్ధే మహాహవే | ప్రాద్యుమ్నిం రక్షితంశ్శైవతేజసా ప్రజ్వలత్తనుమ్ || 13

తతో దశసహస్రాణి తురంగాణాం రథోత్తమాన్ | యుద్ధప్రాప్తేన ఖడ్గేన దైత్యేంద్రస్య జఘాన సః || 14

తద్వధాయ తతశ్శక్తిం కాలవైశ్వానరోపమామ్ | అనిరుద్ధో గృహీత్వా తాం తయాం తం నిజఘాన హి || 15

రథోపస్థే తతో బాణస్తేన శక్త్యా హతో దృఢమ్ | స సాశ్వస్తత్ క్షణం వీరస్తత్రైవాంతరధీయత || 16

తస్మింస్త్వదర్శనం ప్రాప్తే ప్రాద్యుమ్నిరపరాజితః | ఆలోక్య కకుభస్సర్వాస్తస్థౌ గిరిరివాచలః || 17

అదృశ్యమానస్తు తదా కూటయోధస్స దానవః | నానా శస్త్ర సహస్రై#్రస్తం జఘాన హి పునః పునః || 18

ఛద్మనా నాగపాశైస్తం బబంధ స మహాబలః | బలిపుత్రో మహావీర శ్శివభక్తశ్శరాసురః || 19

తం బద్ధ్వా పంజరాంతస్థ్సం కృత్వా యుద్ధాదుపారమత్ | ఉవాచ బాణస్సంక్రుద్ధ స్సూతపుత్రం మహాబలమ్ || 20

ఓ మహర్షీ ! శివుని అనుగ్రహముచే వర్ధిల్లిన తేజస్సుగల ఆ అనిరుద్ధుడు కోపముతో ఎర్రనైన కనులు గలవాడై ఈ విధముగా పదివేల సైన్యమును సంహరించెను (11). లక్ష యోధులు మరణించిన పిదప బాణాసురుడు క్రోధముతో కుంభాండుడు వెంటరాగా, యుద్ధవిశారదుడు, మహాబుద్ధిశాలి, ప్రద్యుమ్నపుత్రుడు, శివుని తేజస్సుచే రక్షింపబడువాడు, గొప్పగా ప్రకాశించే దేహము కలవాడు అగు అనిరుద్ధుని ఆ మహాసంగ్రామములో ద్వంద్వయుద్ధమునకు ఆహ్వానించెను (12, 13). అపుడాతడు యుద్ధములో లభించిన కత్తితో పదివేల గుర్రములను సంహరించి, బాణాసురుని శ్రేష్ఠమగు రథములను ధ్వంసమొనర్చెను (14). తరువాత అనిరుద్ధుడు

ప్రళయకాలాగ్నివంటి శక్తిని చేతబట్టి బాణాసురుని సంహరించగోరి, దానితో వానిని కొట్టెను (15). వీరుడగు బాణుడు రథములో కూర్చునియుండగా ఆ శక్తిచే గట్టిగా కొట్టబడినవాడై గుఱ్ఱములతో సహా వెనువెంటనే అంతర్ధానమాయెను (16).
పరాజయమునెరుంగని ఆ ప్రద్యుమ్నపుత్రుడు ఆతడు అంతర్ధానము కాగానే పర్వతమువలె కదలకుండా నిలబడి దిక్కులనన్నిటినీ పరికించెను (17). మాయాయుద్ధ విశారదుడగు ఆ రాక్షసుడు కనబడకుండగనే అతనిని వేలాది ఆయుధములతో పలుమార్లు కొట్టెను (18). బలిపుత్రుడు, మహావీరుడు, శివభక్తుడు, మహాబలుడు అగు బాణాసురుడు మాయను ప్రయోగించి ఆతనిని నాగపాశములతో బంధించెను (19). ఆతనిని బంధించి పంజరమునందు ఉంచి, ఆ తరువాత బాణుడు యుద్ధమును విరమించి, మహాకోపముతో గొప్ప బలశాలియగు సూతపుత్రునితో నిట్లనెను (20).

బాణాసుర ఉవాచ |

సూతపుత్ర శిరశ్ఛింధి పురుషస్యాస్య వై లఘు | యేన మే దూషితం పూతం బలాద్దుష్టేన సత్కులమ్ || 21

ఛిత్త్వా తు సర్వగా త్రాణి రాక్షసేభ్యః ప్రయచ్ఛ భోః | అథాస్య రక్తమాంసాని క్రవ్యాదా అపి భుంజతామ్ || 22

అగాధే తృణసంకీర్ణే కూపే పాతకినం జహి | కిం బహూక్త్యా సూతపుత్ర మారణీయో హి సర్వథా || 23

బాణాసురుడిట్లు పలికెను -

ఓయీ! సూతపుత్రా ! నా యొక్క పవిత్రమగు వంశమును బలప్రయోగముచే కలుషితము చేసిన ఈ దుష్టపురుషుని శిరస్సును వెంటనే నరికి వేయుము (21) ఓయీ! వీని శరీరమును ముక్కలు ముక్కలుగా నరికి రాక్షసులకు పంచిపెట్టుము. రాక్షసులు వీని రక్త మాంసములను భక్షించెదరు గాక! (22) ఈ పాపాత్ముని

పిచ్చిమొక్కలతో నిండియున్న లోతైన నూతిలో పారవేయుము. ఓ సూతపుత్రా! ఇన్ని మాటలేల? వీనిని ఏ విధముగనైననూ సంహరించుము (23)

సనత్కుమార ఉవాచ|

తస్య తద్వచనం శ్రుత్వా ధర్మబుద్ధిర్నిశాచరః |
కుంభాండస్త్వబ్రవీద్వాక్యం బాణం సన్మంత్రిసత్తమః || 24

సనత్కుమారుడిట్లు పలికెను -

కాని గొప్ప మంత్రులలో అగ్రేసరుడు, ధర్మబుద్ధి గలవాడు అగు కుంభాండాసురుడు బాణుని ఆ మాటను విని అతనితో నిట్లనెను (24).

కుంభాండ ఉవాచ|

నైతత్కర్తుం సముచితం కర్మదేవ విచార్యతామ్ | అస్మిన్ హతే హతో
హ్యాత్మా భ##వేదితి మతిర్మమ || 25

అయం తు దృశ్యతే దేవ తుల్యో విష్ణోః పరాక్రమైః |
వర్ధితశ్చంద్రచూడస్య త్వద్దుష్టస్య సు చేతసా || 26

అథ చంద్రలలాటస్య సాహసేన సమస్త్వ యమ్ I ఇమామవస్థాం
ప్రాప్తో஽పి పౌరుషే సంవ్యవస్థితః II 27

అయం శివప్రసాదాద్వై కృష్ణపౌత్రో మహాబలః Iఅస్మాంస్తృణోపమాన్
వేత్తి దర్పో஽పి భుజగైర్బలాత్ II 28

కుంభాండుడు ఇట్లు పలికెను-

ఓ దేవా! మీరు ఆలోచించుడు. ఈ పనిని చేయుట తగదు. వీనిని సంహరించుట ఆత్మహత్యతో సమమగునని నా అభిప్రాయము (25). ఓ దేవా! ఈతడు పరాక్రమములో విష్ణువుతో సమమైనవానివలె కన్పట్టుచున్నాడు. నీయందు కినుక పూనిన శివుని అనుగ్రహముచే ఈతడు వర్ధిల్లుచున్నాడు (26). ఈతడు

సాహసములో శివునితో సమమైనవాడు. ఈ అవస్థను పొందియు, ఈతడు పౌరుషమును విడనాడకున్నాడు (27). శ్రీ కృష్ణుని మనుమడు, మహాబలశాలి అగునీతడు పాములచే బలముగా కరువబడిననూ, మనలను గడ్డి పోచలతో సమముగా పరిగణించుచున్నాడు (28).

సనత్కుమార ఉవాచ|

ఏతద్వాక్యం తు బాణాయ కథయిత్వా స దానవః |
అనిరుద్ధమువాచేదం రాజనీతివిదుత్తమః || 29

సనత్కుమారుడిట్లు పలికెను-

రాజనీతివేత్తలలో శ్రేష్ఠుడగు ఆ రాక్షసుడు బాణునితోనిట్లు పలికి, అనిరుద్ధునితో నిట్లనెను (29).

కుంభాండ ఉవాచ |

కో%పి కస్యాసి రే వీర సత్యం వద మమాగ్రతః | కేన వా
త్వమిహానీతో దురాచార నరాధమ || 30

దైత్యేంద్రం స్తుహి వీరం త్వం నమస్కురు కృతాంజలిః |
జితో%స్మీతి వచో దీనం కథయిత్వా పునః పునః || 31

ఏవం కృతే తు మోక్షస్స్యాదన్యథా బంధనాది చ | తచ్ఛ్రుత్వా
వచనం తస్య ప్రతివాక్యమువాచ సః || 32

కుంభాండుడిట్లు పలికెను-

ఓరీ వీరా ! నీవు ఎవరివి? ఎవరి వాడవు? నా యెదుట సత్యమును పలుకుము. ఓరీ మానవాధమా! దుష్టమగు శీలము గలవాడా! నిన్ను ఇచటకు ఎవరు తీసుకువచ్చిరి? (30) నీవు చేతులను జోడించి వీరుడగు ఈ రాక్షసరాజును నమస్కరించి స్తుతించుము. దీనుడవై పలుమార్లు జయింపబడితినని పలుకుము (31). ఇట్లు చేసినచో,

నీకు విడుదల లభించును. లేనిచో, నీకు బంధము ఇత్యాదులు తప్పవు. ఆతని ఆ మాటను విని, అనిరుద్ధుడు ఇట్లు బదులు చెప్పెను (32).

అనిరుద్ధ ఉవాచ |

రే రే దైత్యాऽధమసఖే కరపిండోపజీవక | నిశాచర దురాచార శత్రుధర్మం న వేత్సి భోః || 33

దైన్యం పలాయనం చాథ శూరస్య మరణాధికమ్ | విరుద్ధం చోపశల్యం చ భ##వేదితి మతిర్మమ || 34

క్షత్రియస్య రణ శ్రేయో మరణం సమ్ముఖే సదా | న వీరమానినో భూమౌ దీన స్యేవ కృతాంజలిః || 35

అనిరుద్ధుడిట్లు పలికెను-

ఓరీ! నీచుడగు దైత్యుని మిత్రుడా! చేతితోవిదల్చిన మెతుకులను తిని జీవించువాడా! ఓయీ! దుష్టమగు శీలము గల రాక్షసా! నీవు శత్రువుల ధర్మములను ఎరుంగవు (33). శూరునకు దీనముగా పలుకుట, పారిపోవుట అనునవి మరణముకంటె అధికమగు దుఃఖమును కలిగించును. ఇట్టి విరుద్ధమగు చర్య హృదయములో శల్యము అగునని నా అభిప్రాయము (34). క్షత్రియునకు ఎన్నడైననూ యుద్ధరంగములో శత్రువునకు యెదుట మరణము శ్రేయస్కరము. ఈ లోకములో వీరుడననే అభిమానము గలవాడు దీనునివలె చేతులను జోడించడు (35).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాది వీరవాక్యాని బహూని స జగాద తమ్ | తదాకర్ణ్య సబాణోऽసౌ విస్మితోऽభూచ్చుకోప చ || 36

తదోవాచ నభోవాణీ బాణస్యాశ్వాసనాయ హి శృణ్వతాం సర్వవీరాణామనిరుద్ధస్య మంత్రిణః || 37

సనత్కుమారుడిట్లు పలికెను-

అనిరుద్ధుడు ఈ విధముగా ఆతనితో వీరవాక్యములను పలికెను. బాణునితో సహా ఆతడు ఆ మాటలను విని విస్మయమును, కోపమును పొందెను (36). అపుడు ఆకాశవాణి బాణుని ఓదార్చుటకొరకై, అనిరుద్ధుడు మంత్రి మరియు సర్వవీరులు వినుచుండగా ఇట్లు పలికెను (37).

వ్యోమవాణ్యువాచ |

భో భో బాణ మహావీర న క్రోధం కర్తుమర్హసి | బలిపుత్రోఽసి సుమతే శివభక్త విచార్యతామ్ || 38

శివస్సర్వేశ్వరస్సాక్షీ కర్మణాం పరమేశ్వరః | తదధీనమిదం సర్వం జగద్వై సచరాచరమ్ || 39

స ఏవ కర్తా భర్తా చ సంహర్తా జగతాం సదా | రజస్సత్త్వతమోధారీ విధివిష్ణుహరాత్మకః || 40

సర్వస్యాంతర్గతస్స్వామీ ప్రేరకస్సర్వతః పరః | నిర్వికార్యవ్యయో నిత్యో మాయాధీశోఽపి నిర్గుణః || 41

తస్యేచ్ఛయాఽబలో జ్ఞేయో బలీ బలివరాత్మజ | ఇతి విజ్ఞాయ మనసి స్వస్థో భవ మహామతే || 42

గర్వాపహారీ భగవాన్నానాలీలావిశారదః | నాశయిష్యతి తే గర్వమిదానీం భక్తవత్సలః || 43

ఆకాశవాణి ఇట్లు పలికెను -

ఓయీ బాణా ! మహావీరుడవగు నీవు కోపించుట తగదు. నీవు బలియొక్క పుత్రుడవు. గొప్ప బుద్ధిమంతుడవు. శివభక్తుడవు. ఆలోచించుము (38). సర్వేశ్వరుడు, పరమేశ్వరుడు అగు శివుడు కర్మసాక్షి. స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తు అంతయు నిశ్చయముగా ఆయన ఆధీనములో నున్నది (39). ఆయనయే సర్వదా రజస్సత్త్వతమోగుణాత్మకుడై బ్రహ్మవిష్ణురుద్రరూపములను దాల్చి ఈ జగత్తులను సృష్టించి, పాలించి పోషించి, ఉపసంహరించుచున్నాడు (40). పరమాత్మ, వికారములు

లేనివాడు, వినాశము లేనివాడు, నిత్యుడు, మాయను వశము చేసుకున్నవాడు, నిర్గుణుడు అగు ఆ ప్రభుడు సర్వప్రాణుల హృదయములలోనుండి అన్ని విధములుగా ప్రేరణనిచ్చుచున్నాడు (41). ఓయీ బలియొక్క శ్రేష్ఠపుత్రుడా ! ఆయన ఇచ్ఛచే బలహీనుడైననూ బలవంతుడగును. ఓ గొప్ప బుద్ధిగలవాడా ! ఇట్లు మనస్సులో తలపోసి స్వస్థుడవు కమ్ము (42). అనేకలీలలను ప్రకటించుటలో దక్షుడు, భక్తవత్సలుడు, గర్వమును హరించువాడు అగు ఆ భగవానుడు నీ గర్వమును ఇప్పుడు నాశము చేయగలడు (43).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాభాష్య నభోవాణీ విరరామ మహామునే |
బాణాసురస్తద్వచనాదనిరుద్ధం న జఘ్నివాన్ || 44

కిం తు స్వాంతఃపురం గత్వా పపౌ పానమనుత్తమమ్ | తద్వాక్యం చ విసస్మార విజహార విరుద్ధధీః || 45

తతో%నిరుద్ధో బద్ధస్తు నాగభోగైర్విషోల్బణైః |
ప్రియయా%తృప్తచేతాస్తు దుర్గాం సస్మార తత్క్షణాత్ || 46

సనత్కుమారుడిట్లు పలికెను-

ఓ మహర్షీ ! ఆకాశవాణి ఇట్లు పలికి విరమించెను. ఆ మాటను విని బాణాసురుడు అనిరుద్ధుని సంహరించలేదు (44). కాని దుష్టబుద్ధియగు ఆతడు తన అంతఃపురమునకు వెళ్ళి విలువైన పానీయమును సేవించి ఆ మాటలను విస్మరించి విహరించెను (45). ప్రియురాలియందు ఇంకను తనివి తీరని ఆ అనిరుద్ధుడు భయంకరమగు విషమును గ్రక్కే. పాముల పడగలచే బంధింపబడినవాడై అపుడు వెంటనే దుర్గను స్మరించెను (46).

అనిరుద్ధ ఉవాచ |

శరణ్యే దేవి బద్ధో%స్మి దహ్యమానస్తు పన్నగైః | ఆగచ్ఛ మే కురు త్రాణం యశోదే చండరోషిణీ || 47

శివభ##క్తే మహాదేవి సృష్టిస్థిత్యంతకారిణీ | త్వాం వినా రక్షకో నాన్యస్తస్మాద్రక్ష శివే హి మామ్ || 48

అనిరుద్ధుడిట్లు పలికెను -

శరణు పొందినవారియందు సాధువగు ఓ దేవీ ! పాములచే బంధింపబడియున్నాను. విషము దహించుచున్నది. కీర్తిని ఇచ్చు ఓ దేవీ! భయంకరమగు కోపము గలదానా ! వచ్చి నన్ను రక్షించుము (47). శివుని భక్తురాలవగు ఓ గొప్ప దేవీ! సృష్టిస్థితి లయములన చేయుదానవు నీవే. నీవు తక్క రక్షించువారు మరియొకరు లేరు. ఓ శివపత్నీ! కావున నన్ను రక్షించుము (48).

సనత్కుమార ఉవాచ |

తేనేత్థం తోషితా తత్ర కాలీ భిన్నాంజనప్రభా | జ్యేష్ఠకృష్ణచతుర్దశ్యాం సంప్రాప్తాసీన్మహానిశి || 49

గురుభిర్ముష్టినిర్ఘాతైర్దారయామాస పంజరమ్ | శరాంస్తాన్ భస్మసాత్కృత్వా సర్వరూపాన్ భయానకాన్ || 50

మోచయిత్వానిరుద్ధం తు తతశ్చాంతఃపురం తతః | ప్రవేశయిత్వా దుర్గా తు తత్రైవాదర్శనం గతా || 51

ఇత్థం దేవ్యాః ప్రసాదాత్తు శివశ##క్తేర్మునీశ్వర | కృచ్ఛ్ర ముక్తో%నిరుద్ధో%భూత్సుఖీ చైవ గతవ్యథ || 52

అథ లబ్ధజయో భూత్వానిరుద్ధశ్శివశక్తితః | ప్రాద్యుమ్నిర్బాణతనయాం ప్రియాం ప్రాప్య ముమోద చ || 53

పూర్వవద్విజహారాసౌ తయా స్వప్రియయా సుఖీ | పీతపానస్సురక్తాక్షస్స బాణసుతయా తతః || 54

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే అనిరుద్ధోషావివాహ వర్ణనం నామ త్రిపంచాశత్తమో%ధ్యాయః (53).

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఆ సమయములో జ్యేష్ఠకృష్ణచతుర్దశి అర్ధరాత్రమునందు ఈ విధముగా వానిచేత స్తుతించ బడినదై మెత్తని కాటుకవంటి కాంతులు గల కాళి అచటకు విచ్చేసెను (49). ఆమె బలమైన పిడికిలి దెబ్బలతో పంజరమును పగులగొట్టి సర్పరూపములగు ఆ భయంకర బాణములను భస్మము చేసెను (50). అపుడా దుర్గ అనిరుద్ధుని విడిపించి అంతఃపురములో ప్రవేశ##పెట్టి అచటనే అంతర్ధానమాయెను (51). ఓ మహర్షీ ! ఈ విధముగా దేవీ శివశక్తియొక్క అనుగ్రహముచే అనిరుద్ధుడు ఆపదనుండి విముక్తుడై భయము తొలగి సుఖమును పొందెను (52). అపుడు ప్రద్యుమ్నపుత్రుడగు అనిరుద్ధుడు శివశక్తివలన విజయమును పొంది ప్రియురాలగు బాణపుత్రికను చేరి ఆనందించెను (53). అపుడాతడు తనప్రియురాలగు బాణపుత్రికతో గూడి మధుపానముచే ఎర్రని నేత్రములు గలవాడై పూర్వమునందువలెనే సుఖముగా విహరించెను (54).

శ్రీశివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండలో అనిరుద్ధోషావివాహవర్ణనమనే ఏబది మూడవ అధ్యాయము ముగిసినది (53).